తెలుగు తేజము దీప్తి వెందగ
తెలుగు వెలుగులు దిశల నిండగ
తెలుగు తల్లిని గొలువ దీక్షతో
తరలి రావోయ్ అమరజీవి!

తెలుగు సీమకూ
తెలుగుజాతికీ
అమరజీవికీ
మా పుష్పాంజలులు



# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 135/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైదరాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుండి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం   స్థాపితం : 1961   బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం

✆ : 52262 ప్రకాశం జిల్లా.   ✆ : 87158 (S.T.D. 08524) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్లింగములలో రెండవది అగు శ్రీశైలం మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. అనగా 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణా నదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల ఇబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినమునను, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భమునను వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18x15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12x10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ   యక్కలి బాలరత్నం

అధ్యక్షులు   మరియు కార్యవర్గ సభ్యులు   ప్రధాన కార్యదర్శి

వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము

1969



సంపుటి

28



సంచిక

4



డిశంబరు - 1996



సంపాదకులు :

'సంఘోద్ధారక'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 25025,

24911


సంపాదకీయం

# లక్ష్మీకాంతమ్మ గారు ఇక లేరు

ఆంధ్ర సాహిత్య జగత్తులో సుస్థిర స్థానాన్ని సంపాదించు కొన్న కవయిత్రులలో శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ గారూ ఒకరు. తన రచనల కన్నా పదునైన తన వాగ్ధాటితో అనేక సాహిత్య సభల్లో ప్రసంగించి 'సెహబాస్' అనిపించుకొన్న గొప్పవక్త లక్ష్మీకాంతమ్మ గారు. బిరుదులూ, సత్కారాలూ సన్మానాలూ, గౌరవ పురస్కారాలూ అనేకంగా పొందిన ఈమే ఈ డిశంబరు నెల ఒకటవ తేదీన గుంటూరు జిల్లా బాపట్ల విజయలక్ష్మీపురము లోని తమ స్వగృహములో కన్ను మూయడంతో, తెలుగు సాహిత్యము ఒక మంచి రచయిత్రిని కోల్పోయింది.

రాష్ట్రములో, గృహలక్ష్మీ, కంకణాన్ని అందుకొన్న తొలి మహిళ లక్ష్మీకాంతమ్మ గారు. "ఆంధ్ర కవయిత్రులు", "అఖిల భారత రచయిత్రులు" - అను వీరి రచనలు వీరి సాహిత్య కృషికి మైలురాళ్లు. ఆంధ్ర కవయిత్రులకు 1953లో తెలుగు భాషా సమితి నుండి ప్రధమ బహుమతి లభించింది. 'రెండవదైన అఖిల భారత రచయిత్రులు' అను గ్రంథాన్ని 1963లో కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు. 1974లో జరిగిన మొదటి ప్రపంచ తెలుగు మహాసభల్లోనూ, 1975లో రష్యాలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లోనూ సత్కారాలందుకొన్న లక్ష్మీ కాంతమ్మగారు 1990లో కెనడ, టొరెంటో నగరాలకు ఆయా నగరాల ఆహ్వానం మీద వెళ్ళి సత్కారాలందుకొన్నది.

"కళాప్రపూర్ణ" "సాహితీ రుద్రమ" అనునవి ఈమెకు గల బిరుదులు. సంస్కృత, ఆంధ్ర భాషల్లో ప్రవీణురాలైన వీరు 1917 డిసెంబరు నెల 21వ తేదీన ఇప్పటి పశ్చిమ గోదావరి జిల్లా మండపేటలో జన్మించారు. స్వర్గీయ నాళం కృష్ణారావు సుశీలమ్మలు ఈమె తండ్రి, తల్లి. కృష్ణారావు గారు మధుర కవి బిరుదాంకితులు. మధురకవి

ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు

1976లో 'కళా ప్రపూర్ణ' బిరుదుతో సత్కరించగా, 1980లో అనంతపురం జిల్లా కల్లూరు వాస్తవ్యులూ, పారిశ్రామిక వేత్తలూ, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులూ శ్రీ కాసంసెట్టి రాధాకృష్ణయ్య గారు వీరికి, అనంతపురములోని రాయల నాటక కళా పరిషత్ భవనములో కనకాభిషేకం చేసారు

శ్రీమతి లక్ష్మీ కాంతమ్మ గారి జీవిత విశేషాలు, కవితా వ్యాసంగాలను గురించి, తెలుగు విశ్వ విద్యాలయం వారు 'తెలుగు వెలుగు' అను పేరుతో ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని నిర్మించారు

లక్ష్మీ కాంతమ్మ గారు కేవలము రచయిత్రి, వక్తయే కాదు సంగీతములో కూడ చక్కని అభినివేశం కలది చక్కగా వీణవాయించ గలదు

1975 ఈమె జీవితములో చెప్పుకోదగ్గ మంచి సంవత్సరము ఈ సంవత్సరములోనే ఈమెకు ఐదు బంగారు పతకాలు లభించాయి

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహిళా సభ, ఆంధ్ర మహిళా గాన సభ మొదలగు అనేక రాష్ట్రస్థాయి సంస్థలకు అధ్యక్షురాలుగా, పలు సంస్థలకు ఉపాధ్యక్షురాలుగా కూడ పదవీ బాధ్యతలను నిర్వహించారు

స్వర్గీయ ఊటుకూరు హయగ్రీయ గుప్త గారితో వీరి వివాహం 1929లో జరిగింది

వీరి గ్రంధాలలో చెప్పుకోదగ్గది 'కన్యకామ్మ పదాలు' కూడ చక్కని లయ, మంచి శైలి, సరళత్వములతో ఇందులో గేయ రచన సాగింది ఆరుద్ర గారు వ్రాసిన 'కూనలమ్మ పదాలు' వీరి ఈ రచనకు ప్రేరణ కావచ్చు కూనలమ్మ పదాలంత ప్రసిద్ధిని అందుకోకున్నా చదవాలన్న ఆసక్తిని కలిగించే గ్రంధము వీరి ఈ కన్యాకామ్మ పదాలు లక్ష్మీ కాంతమ్మ గారికి ఈ పదాలు చాలా ఇష్టము తాను ప్రసంగించే ప్రతి సభలోనూ ఏదో ఒక సందర్భములోనైనా ఈ పదాలను వినిపించేది

ఏలూరులోని గుప్త ఫౌండేషన్ ప్రతి ఏడూ ఇస్తున్న శ్రీ ముదుపల్లి కృష్ణమూర్తి సాహిత్య పురస్కారాన్ని ఈ డిశంబరు నెల 22వ తేదీన ఈమె అందుకోవలసి ఉంది. ఆ గౌరవం పొందకుండానే ఈమె కన్నుమూసింది. ఈ పురస్కారం క్రింద 25వేల రూపాయల నగదూ, జ్ఞాపికనూ వీరికి లభించనుండగా, ఇంతలోనే తనువు చాలించడం మనసున్న ప్రతి మనిషికీ విషాదాన్ని కలిగిస్తుంది.

ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్రాల్లోని అనేక 'ఫౌండేషను'ల ద్వారా పలుసార్లు సాహిత్య పురస్కారాలను అందుకొన్న శ్రీమతి లక్ష్మీ కాంతమ్మ గారు తెలుగు జాతి గర్వించదగ్గ మహిళామణుల్లో ఒకరు. వీరికి మా శ్రద్ధాంజలి

వైశ్యప్రబోధిని, డిశంబరు 1996

# అమరజీవి పొట్టిశ్రీరాములు
## (సంపాదకుల రేడియో ప్రసంగాల నుండి)

భారత ఇతిహాస చరిత్రలో 'శిబి'కి ఒక సమున్నత స్థానం ఉంది. ఆ స్థానాన్ని అధిగమించిన వాడు పొట్టి శ్రీరాములు. 'శిబి' ఒక పక్షి ప్రాణాలను కాపాడేందుకు తన మేని కండరాలను కోసి ఇచ్చాడు. తన తెలుగు ప్రజలకు స్వంత రాష్ట్రం ఏర్పడేందుకు శ్రీరాములు గారు తన ప్రాణాలనే అర్పించారు. భాషా రాష్ట్ర నిర్మాణాలకు మూల కారకులయ్యారు. అందుకే ఆయన అమరజీవి. త్యాగజీవి. రాష్ట్రపిత. త్యాగానికి మారు పేరు. ఈ సందర్భములో మనము గమనించాల్సింది ఆయన చేసిన ఈ అపూర్వ త్యాగం వెనుక గల స్వార్థరాహిత్యం. ప్రతిఫలాపేక్ష రహిత భావం.

తెలుగు తల్లిని రతనాల జిలుగు పీఠంపై కొలువు దీర్చాలన్న తపనతో ఆయన ఈ ఆత్మార్పణ చేశారు. దాదాపు వెయ్యి సంవత్సరాలకు ఆవల కుసుమార్యుని బిడ్డగా బుట్టిన "వాసవి" చేసిన ఆత్మార్పణకు ఈ శ్రీరాముల ఆత్మార్పణ తిరిగి గుర్తుకు తెచ్చింది.

మనం ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడు అప్పటి మన తెలుగు ప్రజల ప్రతినిధుల వద్దకు వెళ్ళి "ఆంధ్ర రాష్ట్రావతరణ కొఱకు అనశనవ్రతమూన నున్నాను." -అని ఆయన చెప్పినపుడు ఆయన్ను 'వెఱ్ఱికోమటి'గా 'వెఱ్ఱివెంగలప్ప' గా భావించారు. పరిహసించారు. పాపం వారికి ధీరులు అంటే ఏమిటో తెలియదు కాబోలు. "ధీరుల్ విఘ్న నిహన్య మాను లగుచున్ ధృత్యున్న తోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ! ప్రజ్ఞా నిధుల్ కావునన్" అని ఆర్యోక్తి. శ్రీరాములు గారు ధీరులు మాత్రమే కారు. ధీరోదాత్తులు. ప్రజ్ఞానిధులు - స్తుతి - నిందలను సమానంగా భావించే ఆ మహాత్మునకు ఆ మాటలకు విలువ నిస్తాడా?

ఉన్న ఫలానా కానీ, అనుకున్న వెంటనే కానీ శ్రీరాములు గారు ఈ ప్రాణార్పణకు పూనుకోలేదు.

ఆంధ్రులకు గొప్ప చరిత్ర ఉంది. ఆంధ్ర సంస్కృతి గొప్పది. తెలుగు - త్రిలింగము - ఆంధ్రము అనే పదాలు తేనెకన్నా, పనసతొనల కన్నా తీయనివి. తెలుగు భాష ప్రాచీనమైనది. శాత వాహనుల కాలనుండే ఆంధ్రులకు స్వంత రాష్ట్రం ఉంది. సొంత ఏలుబడి ఉంది. తెలుగు తేజము తిరిగి దశదిశలా వెలుగులు నింపాలి. అందుకే ఆంధ్ర రాష్ట్రము కావాలి - అని ఆయన తాను ప్రాణార్పణకు సిద్ధం కాక ముందు నుంచే చాలాకాలంగా - అనేక సార్లు - అప్పటి భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూకు విజ్ఞాపనలు పంపారు. స్వయంగా విన్నవించుకొన్నారు. అయినా ఆంధ్ర రాష్ట్ర ఆవిర్భావం శ్రీరాములు గారి ఆత్మ బలిదానం జరిగిందాకా జరుగలేదు. ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు వల్ల ఆయన జీవితాశయం నెరవేరింది. కీర్తి మాత్రమే లభించింది. ఏ సుఖాన్ని ఆయన అనుభవించలేదు. శ్రీరాములు గారి ఆత్మ బలిదానం వెనుక

ఏ పదవీ కాంక్ష దోబూచులాడలేదు. త్రికరణ శుద్ధిగా ఆయన లక్ష్యము, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపనయే.

ఒకటా? రెండా? పదియా? యాభై ఎనిమిది రోజులు సాగింది ఆ పొట్టి రాముని అనశన వ్రత మహా యజ్ఞము. ఆయన ప్రాణ వాయువులు అనంత వాయువులో విలీన మైనప్పుడు ఆంధ్ర దేశమంతా అట్టుడికి పోయింది. చెన్న నగరమంతా దద్దరిల్లింది. ఆంధ్ర రాష్ట్రమును ఇవ్వక తప్పని పరిస్థితి ఏర్పడింది.

సత్యము - అహింస - హరిజనోద్ధరణము గాంధీ గారికి ప్రాణ ప్రదాలు. శ్రీరాములు గారికి పై మూడు సూత్రాల మీద ప్రగాఢమైన విశ్వాసం. ఆయనలోని ఈ విశ్వాసమే ఒకనాటి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం చేత హరిజన ప్రవేశానికి ప్రత్యేక శాసనాలను చేయించింది.. "అంటరాని తనాన్ని ఆచరించడము మానవులకే కాదు, ఈశ్వరునికే మచ్చ" అని గాంధీగారు అనేక సార్లు చెప్పేవారు. ఆ మాటలను అట్టలపై వ్రాసుకొని ఆ అట్టలను తనముందు, వెనుకల తగిలించుకొని, మండుటెండలో- కాలికి చెప్పులు - ఒంటికి చొక్కా - తలపై గొడుగూ లేకుండా ఊరూరా తిరిగిన జగాజెట్టి శ్రీరాములు. గృహస్థులు పెట్టిన భిక్షతో పొట్టనింపుకొన్న ఈ దీక్షాదక్షుడు రిలే నిరాహార దీక్షలతో నవ్వుల పాలైన ఉపవాస వ్రతానికి ఊపిరి పోసిన ఉత్తమోత్తములు. నిరశన వ్రతాదుల ఎడ అణు మాత్రమూ విశ్వాసం లేని, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు గారిని కూడ తన దీక్ష కనుకూలంగా త్రిప్పుకొన్న శ్రీరాముల సంకల్ప శక్తి అద్వితీయము.

శ్రీరాములు గారు 1901వ సంవత్సరం మార్చి నెల 15వ తేదీన మద్రాసులో జన్మించారు. తల్లి మహాలక్ష్మమ్మ, తండ్రి గురువయ్య. వీరి తల్లిదండ్రులది మొదట ఇప్పటి ప్రకాశం జిల్లా (ఒకనాటి నెల్లూరు జిల్లా) కనిగిరి మండలానికి చెందిన పడమటిపల్లి. ఇది చెర్లోపల్లెకు శివారు గ్రామము. ఈ గ్రామంలో జరుగుబాటు లేనందున మహాలక్ష్మమ్మ, గురువయ్య గారలు తమిళనాడులోని 'పొన్నేరి'కు సమీపాన గల 'న్యాయపాలెము' అనే గ్రామానికి వలస వెళ్ళారు. అక్కడ కూడ పరిస్థితులు అనుకూలించ నందున మద్రాసు నగరము చేరుకొని, "అణ్ణాపిళ్లై వీధి" లోని 163వ నెంబరు గల ఇంటిలో స్థిరపడ్డారు. తల్లి మహాలక్ష్మమ్మ గొప్ప వ్యక్తిత్వం కలది. ఆయమ వ్యక్తిత్వ విశేషం శ్రీరాములు గారి జీవితం మీద మంచి ప్రభావాన్ని చూపింది. తన కొడుకును ఒక మహా వ్యక్తిగా తీర్చి దిద్దేందుకు ఆయమ అన్ని రకాలా శ్రద్ధ తీసుకొంది.

అందుకే శ్రీరాములు గారికి తల్లి అంటే మహా భక్తి. తమతల్లి ఉన్నతిని. శ్రీరాములు గారు ఎంతో గొప్పగా అనేక సార్లు చెప్పుకొనే వారు. 'తాను ఏది చేసిన అది తన తల్లిపెట్టిన ఒరవడియే" అనీ తన తల్లి ఇచ్చిన ఆ ఒరవడియే తన జీవితానికి గొప్ప స్ఫూర్తిని ఇచ్చిందనీ, ఉత్తేజాన్నీ, శక్తినీ, దీక్షా పటిమనూ ప్రసాదించింది అనీ శ్రీరాములు గారు చెప్పేవారు.

'పట్టు పట్టరాదు, పట్టిన విడరాదు, పట్టనేని బిగియ పట్టవలయు, పట్టి విడుచుట కంటే పడి చచ్చుటే మేలు' అను వేమన్న పలుకులు శ్రీరాములు గారికి సర్వదా సంస్మరణీయాలు. అందువల్లనే శ్రీరాములు గారిని ప్రసిద్ధ కవులూ,

రచయితలూ, కళాప్రపూర్ణ కొండపేటి వెంకట కవి గారు "పరమర్షి శేఖరులు శ్రీరాములు గా"రంటూ కొనియాడారు.

శ్రీరాములు గారి విద్యాభ్యాసం మద్రాసు నగరములోనే జరిగింది. బొంబాయిలో శానిటరీ ఇంజనీరింగ్ చదివారు. 1922లో శ్రీరాములు గారికి వివాహం, ఆయన మేనమామ కూతురు లక్ష్మమ్మతో జరిగింది. వివాహానంతరము లక్ష్మమ్మ పేరు సీతమ్మగా మారింది. తన కొడుకు శ్రీరాముడు, తన కోడలు సీతమ్మ కావాలని శ్రీరాములు గారి తల్లే ఈ పేరును మార్పించదట. వీరికి ఒక కుమారుడు కలిగాడు. 1925 ప్రాంతంలో శ్రీరాములు గారికి జి.ఐ.పి. రైల్వేలో 'శానిటరీ ఇంజనీర్' గా ఉద్యోగం లభించింది. ఆయనకు ఇరవై ఐదేండ్ల వయస్సులో మొదట తల్లి, తర్వాత భార్య, ఆ తర్వాత తాను ఎంతో ప్రేమగా పెంచుకొంటున్న తనయుడు చనిపోయారు. ఒకే సంవత్సరంలో వరుసగా జరిగిన ఈ మూడు మరణాలు ఆయనను బాగా క్రుంగ దీశాయి. ఆ బాధ నుండి ఆయన తేరు కోడానికి కొంత కాలం పట్టింది. అయితే ఈ కాలంలో ఆయనలో గొప్ప మార్పు కూడ కలిగింది. తన వారిమీద గల తన లోని మమకారాన్ని విశ్వజనీనం చేశారు. ఆ భావం క్రమ క్రమంగా ఆయనలో ఒక బలమైనదిగా రూపుదిద్దు కొంది. చివరకది ఒక మహోన్నత నూతన ఉత్తేజమై, మహామానవునిగా ఆయనకు చరిత్రలో స్థిరమైన స్థానాన్ని కల్పించింది.

శ్రీరాములు గారు సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళి గాంధీ మహాత్మునికి అంతే వాసి అయ్యారు.. గాంధీ గారు ఆశ్రమములో తన కప్పగించిన పనులన్నింటినీ త్రికరణ శుద్ధిగా చేసి అతి తక్కువ కాలములోనే మహాత్ముని హృదయములో స్థిరమైన స్థానం కల్పించు కొన్నారు. శ్రీరాములు గారి నిరాడంబరము, మిత భాషిత్వమూ, కర్తవ్య నిర్వహణలో గల శ్రద్ధ, ఆసక్తి, మహాత్ముని బాగా ఆకర్షించాయి. గాంధీగారి పద్ధతు లను బాగా అలవరచుకొన్న మన రామయ్య గాంధీ గారికి నిజమైన వారసులే అయ్యారు.

గాంధీ గారు నడిపిన మహా ఉద్యమా లన్నింటిలో శ్రీరాములుగారు అగ్రగామిగా నిలిచారు.

ప్రజాసేవే పరమార్థంగా భావించి - పులకించి - తరించి పోయిన ఏర్నేని సుబ్రమణ్యం గారు శ్రీరాములు గారిని ఆత్మబంధువుగా భావించారు. కొమరవోలులో తాను స్థాపించిన గాంధీ ఆశ్రమ నిర్వహణా బాధ్యతను శ్రీరాములు గారికి అప్పగించారు. 1943నుండీ నెల్లూరు జిల్లాలో ఖాదీ ప్రచారాన్ని సాగించిన శ్రీరాములు గారు కొమరవోలు ఆశ్రమము నుండీ గాంధీ గారు జరిపిన చరిత్రాత్మకమైన "దండి" యాత్రలో గాంధీతోపాటు పాల్గొన్న ఏకైక ఆంధ్రులు.

శ్రీరాములు గారు మూడుసార్లు కారాగార వాసక్లేశాన్ని అనుభవించారు. అందులో ఒకటి, మహాత్ముని స్వర్గారోహణ రోజైన జనవరి 30వ తేదీని ప్రతి యేడూ 'హరిజన దినం'గా అప్పటి మద్రాసు ప్రభుత్వముచే ప్రకటింప జేయుటకు. ఈ విషయములో ఆయన ఉత్తరాల ద్వారా చేసిన విజ్ఞప్తులు ఫలించనందుకు అప్పటి మద్రాసు రాష్ట్ర ప్రధాన సచివులు ఓమండూరు రామ స్వామి రెడ్డి గారి అధికార భవనము ఎదుట సత్యాగ్రహానికి కూర్చోవాల్సియ్యాక మద్రాసు

పోలీసులు శ్రీరాములు గారి మీద "న్యూసెన్సు" కేసు పెట్టి ఒకనెల రోజులు జైల్లో పెట్టారు జైలు నుంచి విడుదల అయిన తర్వాత ఆయన తన కార్యరంగాన్ని వార్ధాలోని సేవాగ్రామ్‌కు మార్చుకొన్నారు. ఆ సమయములో అప్పటి భారత రాష్ట్రపతి శ్రీ రాజేంద్ర ప్రసాద్‌గారు సేవాగ్రామ్‌లో ఉండడమే శ్రీరాములు గారి ఈ కార్యరంగం మార్పుకు కారణము. శ్రీరాములు గారి సత్యాగ్రహం, పట్టుదల శ్రీరాములు గారి యెడల తనకు గల గౌరవాన్ని తెలియజేస్తూ రాజేంద్రప్రసాద్‌గారు రామ స్వామి రెడ్డి గారికి లేఖ వ్రాశారు. రామ స్వామి రెడ్డి గారు జనవరి 30ని హరిజన దినంగా ప్రకటించారు. ఆ ప్రకటన విన్నాక శ్రీరాములు గారు సత్యాగ్రహమును చాలించారు. శ్రీరాములు గారి ఈ విజయాన్ని తెలుసుకొన్న వినోభాభావే గారు "మా ఆశ్రమ వాసుల మనసులలోని మురికిని కడిగి మాలో చైతన్యాన్ని కలిగించుటకు మా కోసం మా కుటుంబీకు డగు శ్రీరాములు గారే సత్యాగ్రహం చేయవలసి వచ్చింది" అన్నారు.

శ్రీరాములు గారు తన జీవిత కాలంలో మొత్తము నాలుగు సార్లు నిరశన వ్రత దీక్షను పూనాడు. అందులో మొదటిది నెల్లూరు పట్టణము మూలపేటలో గల శ్రీ వేణు గోపాల స్వామి ఆలయములో హరిజనులకు ప్రవేశాన్ని కల్పించుటకు. ఈ నిరశన వ్రతం పది రోజులు సాగింది. శ్రీరాములు గారి సత్యాగ్రహ పటిమను, పట్టుదలను గమనించిన, అప్పటి ఆ ఆలయాధ్యక్షులు శ్రీ ఆనం చెంచు సుబ్బారెడ్డి గారు హరిజనులకు ఆలయ ప్రవేశం కల్పించారు. ఈ సందర్భములో శ్రీరాములు గారిని శారీరకంగా కూడ హింసించారు. శ్రీరాములు గారు సత్యాగ్రహం చేస్తున్న ఈ సమయములో గాంధీ గారు పూనాలో ఉన్నారు.. ఆయన్ను చూడడానికి పత్రికా ప్రతినిధులు వెళ్ళగా గాంధీ గారు వారితో "చూడడానికి ఇక్కడ ఏముంది? దక్షిణ భారతానికి వెళ్ళండి. నెల్లూరులో ఒక మహానుభావుడు హరిజన దేవాలయ ప్రవేశం కోసం ప్రాయోపవేశం చేస్తున్నాడు. వారి ఆశయం నెరవేరడానికి తోడ్పడండి" అని చెప్పారు. ఆ పాత్రికేయులు టెక్కలు కట్టుకొని, నెల్లూరు మీద వాలారు.

నాల్గవదీ చివరదీ అయిన సత్యాగ్రహం మద్రాసులో జరిగిన ఆంధ్ర రాష్ట్రావతరణ కొఱకైనది. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర స్థాపన కొఱకు శ్రీరాములు గారు 19-10-1952వ తేదీ ఉదయం 10 గంటలకు ఈ నాల్గవ సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. చెన్నపురిలో గల మైలాపూర్‌లోని శ్రీ సాంబమూర్తిగారి వసతి గృహమున ప్రారంభమైన ఈ సత్యాగ్రహం 58 దినములు సాగింది. 15-12-1952వ తేదీ రా 11గం. 20ని.లకు ఆ మహనీయుని ప్రాణ వాయువులు అనంత వాయువులో లీనము కావడముతో ఈ అనశనవ్రతము ముగిసింది. "చివరి రోజుల్లో, బాగా కృశించి పోయిన శ్రీరాములు గారి దేహకాంతి వర్ణనాతీతము" అని ఆ సమయములో ఆయన్ను చూచిన శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారన్నారు.

శ్రీరాములు గారి అంతిమ యాత్ర ఊరేగింపు రెండు మైళ్ళు పొడవున జరిగింది. అంత పెద్ద ఊరేగింపులో ఒక్క దుస్సంఘటన కూడ జరుగలేదు. తెలుగులు - అరవలు గొంతులు కోసుకొంటారని భావించిన వారు నిర్విణ్ణులై

శ్రీరాముల ఆత్మ శక్తికి జోహార్లు అర్పించారు.

పద్మాసన స్థితిలో ఉన్న శ్రీరాముల మృత దేహాన్ని పూల రథముపై ఉంచారు. ఒక ప్రక్క మహర్షి సాంబమూర్తి గారు ఆసీనులయ్యారు. ఆ ఊరేగింపు సెంట్రల్ స్టేషనును సమీపించగా ఆంధ్రకేసరి వచ్చి మరో ప్రక్కన కూర్చొన్నారు.

"నేను చైతన్యమును కోల్పోయినపుడు నా దీక్ష కపచారమొదవు కృత్యములు సేయకుడు" అని ప్రాయోపవేశ దీక్షా సమయములో శ్రీరాములు గారు అన్న మాటలు వారి మహత్తరమైన ఆత్మ స్థైర్యమునకూ, పట్టుదలకూ తార్కాణాలు.

ఇక, మూడు నాలుగు రోజులలో ఈ మహాత్యాగి శరీరమునుండి ప్రాణవాయువులు లేచి పోతాయనగా ఒక నాటి సాయంత్రం ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులు గారు శ్రీరాములు గారిని చూచుటకు వచ్చారు. అప్పుడు శ్రీరాములు గారు అయన్ను చూచి, "ఈ లోకములో సత్యాహింసలకు తావు లేదా?" అని ఆయన్ను అడిగాడు. ఆనాడే కాదు ఈనాడు కూడ ప్రజలు, నాయకులు జవాబు కొఱకు తీవ్రంగా ఆలోచించాల్సిన ప్రశ్న ఇది.

శ్రీరాములను మనము దక్కించుకొనలేక పోయాము. అతడు చాలా గొప్పవాడు. గాంధీ అస్తమయానంతరము సత్యాహింసలు నవ్వులాట పాలగుటకు అతడు విచారించెను. ఉత్తమములని తాను విశ్వసించిన ఆ సత్యాహింసలకు తిరిగి ప్రాణ ప్రతిష్ఠ జేయ ప్రతిజ్ఞగైకొనెను. నేను ఉపవాసములలో నమ్మకము లేనివాడను. కాని శ్రీరాములు ఉపవాసముల వలన ఏమి సాధింప వచ్చునో తన ప్రాణాలనే అర్పించి చూపినాడు. శ్రీరాములు చనిపోయినాడని మనలో కొందరు విచారిస్తున్నారు. అతడు చావలేదు. అతడు అమరజీవి. మనందరిలో అతడు ప్రవేశించెను. దేవుడు సర్వత్రా వ్యాపించి ఉన్నట్లుగా అతడు మనలో వ్యాపించి పోయినాడు. అని ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులు గారు శ్రీరాముల అంతిమ యాత్రానంతరము పలికారు.

"శ్రీరాములు వంటి కార్యదీక్షా పరులు మరి పదిమంది ఉన్నచో స్వరాజ్యమును ఒక సంవత్సరములో సాధించ గలను" అన్న మహాత్ముని వాక్కులు శ్రీరాములు గారి కార్యదీక్షకు తార్కాణాలు.

"తెలుగు తల్లిని రతనాల జిలుగు పీర
పట్టమును గట్టవలెనన్న పట్టుదలతొ
ప్రాణములవీడు, త్యాగ సామ్రాట్టు వీవు
పొట్టిరామయ్య! నినుబోలు దిట్టలెవరు"

"కల్ల కపటములేని కర్మ వాగ్వైఖరి
స్వార్థచింతలేని సాధురీతి
నభ్యసింతుమేని అమ్మహాత్ముని యాత్మ
సంతసించు విశ్వశాంతి విరియు"

– శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

"సాగిలి మ్రొక్కరా! తెలుగు జాతికి
భాగ్యవిధాతయౌ మహా
త్యాగికి, అర్ధనూట పదహారులు
జీవిత సుప్రభాతముల్
యాగహవిస్సులో సలిపె, ఆయన
సత్యతపస్సులోనశ్రీ
బాగు ఫలించెరా! తెలుగు బాగుకు
మూలము పొట్టిబాబురా!

– కరుణశ్రీ

(అమరజీవి
వర్థంతి సందర్భంగా)

# ఆర్యవైశ్య మహాసభలు - ఒక పరిశీలన

*(స్వర్గీయ పోలేపల్లె వెంగన్న శ్రేష్ఠి గారు కడప జిల్లా వల్లూరు వాస్తవ్యులు. ఆచారాలు, సంప్రదాయాలు, వైదిక విధానాలు బాగా తెలిసిన వారు. "వైశ్యులకు వైదిక కర్మార్హత లేదు" అని తనతో వైదికంగా కార్యక్రమాలు జరిపించుటకు తిరస్కరించిన కొందరు బ్రాహ్మణులపై సవాలు చేసి, జీవితాంతమూ వైదిక కర్మలనే ఆచరించిన కర్మిష్ఠులు. మహా నైష్ఠికులు, మంత్ర, యంత్ర, ఆరాధనా విధానాలు బాగా తెలిసిన వారు..అందుకే ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు శ్రీ రాధాకృష్ణయ్య గారు అధ్యక్షులుగా ఉన్నపుడు, శ్రీ వాసవీ దేవికి నిర్దుష్టమైన బింబ, మంత్ర, యంత్ర ఆరాధనా క్రమాలను నిర్ణయించుటకు శ్రీ వెంగన్న శ్రేష్ఠిగారు ఒకరితోనే ఉప సంఘాన్ని ఏర్పాటు చేసి వారు చెప్పిన్న విధానాన్ని 1981లో కాచిగూడలో జరిగిన రాష్ట్ర జనరల్ కౌన్సిల్ సమావేశములో ప్రకటించారు. శ్రేష్ఠి గారికి 'రాజ' అనేది అన్వర్థ పౌరుష నామధేయము. అందుకే ఆయన పోలేపల్లె వెంగన్న (రాజ) శ్రేష్ఠి అనే వ్రానుకునేవారు. రాజాగారు ఈ వ్యాసాన్ని 1983లో వ్రాశారు. - సంపాదకులు)*

దాదాపు 60 సంవత్సరములుగా అఖిలభారత ఆర్యవైశ్య మహాసభలు, తెలంగాణా ఆర్యవైశ్య మహాసభలు, ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభలు జరిగిపోయినవి, జరుగుచున్నవి. ఏ ప్రదేశ మహాసభలు జరిగినా కాలానుగుణ్యముగా వేలు, లక్షల రూపాయల వ్యయముతోనే సభలు జరిగినవి, జరుగుచున్నవి. వ్యయభారమెంత యధికమో తీర్మానముల ఆచరణ భారములంత స్వల్పముగా కనిపించు చున్నవి. ఇంత మాత్రమునకే తీర్మాణముల ప్రతిపాదనలు, సవరణలు, తర్జన భర్జనలతో ప్రతిపాదింపబడి చప్పట్లతో తీర్మానములు జరిగి పుస్తకములకెక్కుచున్నవి. గడచి పో సభలలో జాతికీ, కులమునకూ, సాంప్రదాయ ఉద్ధరణకూ, కవి పండిత పోషణకూ, స్త్రీ జనాభ్యుదయమునకూ, వైదిక విద్యాభివృద్ధికీ, శరీర వ్యాయామ కళాపోషణకూ ప్రాముఖ్యతనిచ్చి, జాతిని ఉత్తేజమునకు తీసుకొనివచ్చే తీర్మానములు ఆచరణలతో, కుల కట్టుబాట్లతో నడచినవి. అఖిలభారత ఆర్యవైశ్య మహాసభల నాయకాధ్యక్ష పరంపరలోని పెద్దలు కొందరు మహాసభలకు సంబంధించిన ఆర్థిక స్తోమతను జవాబు లేకుండా అ[illegible] మొందింపగా అంతటితో అఖిల భారత ఆర్యవైశ్య మహాసభలు అంతము

చేయబడినవి. తెలంగాణా మహాసభలు కొద్ది కాలములోనే ఆగిపోయినవి. ఇటీవల ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభలు ప్రారంభదశనుంచే గట్టి ప్రయత్నములు చేసి ఆర్థిక స్తోమతను పెంచుకొని, వాటికొక భద్రత, స్థానము కల్పించుకొన్నవి. విజయవాడతో ప్రారంభమయిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభలు మధ్యంతరముగా కర్నూలు పట్టణములోనూ, 1982లో వరంగల్లు లోనూ జరిగినవి. సభలలో అధ్యక్షులూ, రాష్ట్ర రాష్ట్రేతర నాయకమ్మన్యులూ, మంత్రివర్యులు, కవి, పండిత, కళాకారులూ, మహిళామణులూ, పెద్దలు అనేకమంది ఊరేగింపులతో, శాలువలతో, మెమెంటోలతో సత్కరింపబడి ధన్యోస్మి అనుకొన్నారు. అనేక తీర్మానములు తర్జన, భర్జన, చప్పట్ల ఆమోదముతో పుస్తకములలో చేర్చబడినవి. జాత్యభివృద్ధి, కుల సాంప్రదాయ కులదేవత వాసవీదేవి ఆలయము లోని అర్చనాదులు, రూప, యంత్ర, మంత్ర తీర్మాణ నియమములను, గౌణస్థితిలో చేర్చి, రాజకీయ ప్రవేశములకు ముఖ్యస్థానమొసంగి నానా తంటాలూ పడుచున్నారు. స్వజాతికేగాక ఇతర జాతుల విద్యాభివృద్ధులకు తోడ్పడకోరి ముందుకు పోదలచుకొన్న వైశ్య సంఘీయుల ఇతర సంఘీయులు సాధించిన రాజకీయ ప్రవేశములలో అనుకోతగ్గ ప్రగతిని సాధింపలేక పోతున్నారు. (కూరలో కరివేపాకు (కరేపాకు) ముఖ్యమయినదే. కరివేపాకు లేనిది ఏ పదార్థము రుచియివ్వదు. తినేటప్పుడు ఆ కరివేపాకును ఏరి పారవేస్తారు. కాని తినరు. దీని భావమేమి తిరుమలేశ) ప్రగతిని సాధించి బ్రతికి బయట బడ్డవారు వ్రేళ్ళమీద లెక్కింప తగినవారు మాత్రమే. మహాసభలు జరుపుతామన్నంత ఉత్సాహం, స్వసంఘోద్ధరణ యందు, స్వజాతి అమ్మవారి ఆలయ పూజాదుల యందు ఏ మాత్రమూ గోచరించుట లేదు. దేశములో అమ్మవారిశాలలో గల పార్వతి రూపముతో, వాసవి పేరుతో చలామణి యగుచున్న వాసవీదేవికి వాసవి పేరుతో పూజార్చనాదులు జరుపుటకు, జరిపించుటకు చేతకాని, శక్తిలేని, ఆలోచనలేని, నాయకులు, సంఘాధ్యక్షులు, ఎందరో ఉన్నారంటే అతిశయోక్తి కాదు. పది మొదలు పదివేలకుపైగా వైశ్యుల యిండ్లు కలిగిన పల్లె, గ్రామ, తాలూకా, జిల్లా, పట్టణ ప్రాంతములలో మన అమ్మవారిశాలలో మన సొమ్ముతో పోషింపబడుచున్న అర్చకమ్మన్యులు మన అమ్మవారికి ఏ పూజలు, జరిపించుచున్నారు? అనే గమనింపు గల వైశ్యులు నూటికి ఒకరిద్దరయినా కలరా? వివాహము కాని వాసవీ కన్యక మెడలో కొన్ని అమ్మవారిశాలలో తాళిబొట్లు కలవు. బిరుదులు సంపాదించిన నాయకులెందరో దేశములోనున్నారు. వారిలో ఈ గుర్తింపును గమనించి ఈ అవినీతిని

అధర్మమును అరికట్టినవారెంత మంది కలరు? ఎపుడో, ఏ కాలమునాడో మనవారు రాజ్యాలు ఏలినారు. మంత్రిపదవులు స్వీకరించినారు. ఖజానాదారులుగా వున్నారు. మావారు నేతులు త్రాగారు. మా మూతులు వాసన చూడండి అంటే ఎంత వింతగా ఉంటుందో మన రాజకీయ ప్రవేశ ఆలోచన అలాగ్లే వుంటుంది. మనవారు ఉద్యోగముల కొరకు ప్రాకులాడువారు చాలామంది తయారవుచున్నారు. కొందరు ఉద్యోగములలో చేరినారు. చేరుచున్నారు. చేరుటకు సిఫార్సులు ప్రయత్నములు చేయుచున్నారు. ఉద్యోగములు రావడమే మన వారికి కష్టముగా నున్నది, ఎట్లనో ఉద్యోగములు వచ్చినవారు, ఇతర జాతులు తమ తోటి జాతి వారైనవారికి అనేక విషయములలో సహాయ సంపత్తులు కలుగచేస్తూవుంటే మన వారెందుకు పిరికిమందు సేవించి ముఖమాటపడి సహాయము చేయలేక పోవుచున్నారో అర్థం కావటంలేదు. ఇలాంటి వారికి ఉద్యోగముపై కోరిక లెందులకు? ఇలాంటి పిరికివారికి ఆర్థికాది సహాయ సంపత్తులు కల్పించి సంఘము తోడ్పడుట ఎందులకు? వరకట్నములపైన ప్రభుత్వమువారు శాసనములతో,. ప్రజా సంఘములు, ఘరానా నాయక వినాయ కమ్మన్యులు, ప్లాటుఫారం ఉపన్యాసములు దంచు చున్నారు. ఏ ఉపన్యాసకుడైనా తాను కట్నం తెచ్చుకోకుండా, ఇవ్వకుండా వివాహములు చేయుచున్నాడా? కట్నములు ఇవ్వకపోతే వయస్సు వచ్చిన తమ ఆడబిడ్డలను ఎన్ని ఏండ్లని ఇంటిలో పెట్టుకొని కాపలాకాయుచూ భరింపగలడు. కాపాడగలరు. ఇది సాధ్యమేనా? పేదవారు, మధ్య తరగతి వారు, లక్షాధిపతులు, కోటీశ్వరులు, అన్ని జాతులవారు ఆలోచించవలసిన విషయము కదా ఇది? ఈ శుష్క ప్రచారము వల్ల ఎంత మంది లాభము పొందగలుగు చున్నారు. ప్రభుత్వము వారి హరిజనోద్ధరణము ఎటువంటిదో, వరకట్న పిశాచములు పారద్రోలే డబ్బా డప్పులు అలాంటివే. కార్యాచరణములు చేయలేని సంఘ తీర్మాణములు ఎందులకు? టీపార్టీలకా? డిన్నర్ పార్టీలకా? ఇవి శుష్క లాపాలు. శూన్యహస్తాలుగాక మరేమిటి. ఏ పని కూడా ఆచరించి అమలులో పెట్టినవాడు మన జాతికి చెందిన గాంధీ మహాత్ముడే కదా. ఆయన పేరుతో గాంధేయులమని చెప్పుకొనుచుండు ప్రభుత్వము, సంఘీయులు ఘోరాపచారము చేసిన వారే కదా? సిగ్గుచేటు కదా? స్వసంఘీయులలో ఐకమత్యము లేక, స్వభాషాభివృద్ధి పోషణాదులు లేక, ఈర్ష్య, అసూయ, ఓర్వలేని తనము, పరస్పర విద్వేష, విబేధ కారణములు ఆసరాగా తీసుకొని సంఘముతో ముడిపెట్టి తమ గెలుపును సాధించుకొను ప్రయత్నములు వీటి కన్నిటికి ముఖ్యకారణములని, ఇది మన సంఘ దౌర్భాగ్యస్థితి యని చెప్పక

తప్పదు. ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభవారు శ్రీ వాసవీ రూప, మంత్ర, యంత్రముల నిర్మాణ ప్రయత్నములు, దేశములో యిదివరకు జరిగిన వ్యత్యస్తములు గత జలసేతు బంధనము కాగా, పోగా జరుగబోవు రోజులలో వాసవీదేవికి ఒకే రూపము, ఒకే మంత్ర, యంత్రములు నిర్మించి స్వజాతి కందించు కోరికతో ప్రయత్నములుచేసి, కృషి చేయించి, రూపొందించి మహాసభవారు దానిని ప్రామాణిక రూపముగా ఆమోదించి ప్రకటించారు. 1981 జనవరి వైశ్యప్రబోధిని ఆ రూపమును ప్రకటించింది. అందులో రెండు చేతులే వున్నవి. రూపముతోబాటు మంత్ర, యంత్రము గూడ ప్రకటించింది. 1982 సంవత్సరములో వరంగల్ లో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ వేదికపైన చిత్రించి తొలగించిన వాసవీ రూపము చతుర్భుజములు కలిగి వున్నది. ఆ సంగతి మహాసభ వారికి జ్ఞాపకమున్నదా? ఈ విధముగా స్వవచనా ఘాతమును మహాసభవారే ప్రారంభించితే మిగత శాఖా సంఘములు చేయు వ్యత్యస్తపు పనులను ఏమని తప్పులు పట్టగలము? కంచే చేను మేయను మొదలిడితే కాపాడేవారెవరు? గీతాధ్యయనము చేయుచుండు పెద్దలు గీతలో గల శ్రేష్ఠులు ఏదయితే ప్రమాణముగా తీసుకొంటారో, దానినే లోకం ఆచరిస్తుంది అనే వాక్యమును మరచి పప్పులో కాలువేసినారా? స్వధర్మే నిధనం శ్రేయః అనే గీతా వాక్యాన్ని మరిచిపోతే పతనమునకు దారి చూపిన వారవుతారు.

### సారస్వత నికేతన వ్యవస్థాపకులు

## పూటుకూరి వేంకటసుబ్బరాయ శ్రేష్ఠి

ఆంధ్రప్రదేశ్‌లోని అత్యుత్తమ గ్రంధాలయాలలో ఒకటిగా పేరుపొందిన సారస్వత నికేతన వ్యవస్థాపకులు, ప్రధాన దాత పూటుకూరి వేంకటసుబ్బరాయ శ్రేష్ఠి గారు 1894వ సంవత్సరము నవంబరు 20వ తేదీన జన్మించారు తల్లి మహాలక్ష్మమ్మ, తండ్రి వెంకటస్వామి శ్రేష్ఠి గారు. పినతండ్రి తాతయ్య శ్రేష్ఠి గారి దత్తపుత్రులు. వేటపాలెంలో ప్రాధమిక విద్య, బాపట్లలో హైస్కూలు విద్య ముగించి కాకినాడ పి.ఆర్. కాలేజీలో ఉన్నత విద్యను అభ్యసించారు.

చిన్ననాటి నుంచి విద్యా ప్రచార కార్యక్రమాలలో, సంఘసంస్కరణ కార్యక్రమాలలో ఆసక్తి చూపించారు. 1918లో కొందరు యువకులను ప్రోత్సహించి, వేటపాలెంలో 'హిందూ యువజన సంఘం' అనే పేరుతో ఒక గ్రంధాలయాన్ని స్థాపించారు. రెండు సంవత్సరములు కోశాధికారిగాను, మూడు సంవత్సరములు కార్యదర్శిగాను పనిచేశారు. ఆదాయం తక్కువ, వ్యయం ఎక్కువ కావటంతో అప్పులలోపడి గ్రంధాలయం మూతపడే

పరిస్థితులలో 1924లో శ్రేష్ఠి గారు ఆ సంస్థ నిర్వహణ బాధ్యతలు స్వీకరించారు. అప్పులుతీర్చి కొంత మూలధనమును ఏర్పరచి 'సారస్వత నికేతనము'గా పేరు మార్చి తామే పరిపాలక ధర్మకర్తగా జీవితాంతం ఉండి ఒక ప్రతిష్ఠాత్మకమైన గ్రంథాలయంగా రూపొందించారు. గ్రంథాలయమునకు ఒక భవనమును దానంగా ఇచ్చి జాతీయోద్యమ ప్రముఖులు మహాత్ముని అనుయాయులు, సేఠ్ జమ్నాలాల్ బజాబ్ గారిచే ప్రారంభింప జేశారు. 1929 ఏప్రిల్ 18న గ్రంథాలయ నూతన భవనానికి జాతిపిత మహాత్మా గాంధీచే శంకుస్థాపన చేయించారు.

అచిర కాలంలోనే భవన నిర్మాణం జరిగింది. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారు యీ భవన ప్రవేశ మహోత్సవం కావించారు. ఈ విస్తరణను శ్రేష్ఠి గారి సోదరులగు కోటిలింగం శ్రేష్ఠి గారి సతీమణి మీనాక్షమ్మ గారల స్మారక మందిరమని నామకరణం చేశారు.

గ్రంథాలయం నానాటికీ పెరగడంతో భవనానికి మరో అంతస్తు నిర్మాణానికి శ్రేష్ఠి గారి కుటుంబ సభ్యులు. సమీప గ్రామస్తులు ద్రవ్య సహాయం చేశారు. ఈ విభాగానికి శ్రేష్ఠి గారి భార్య కమలాంబ పేరు పెట్టారు.

ఈ గ్రంథాలయం తెలుగుదేశం నలుమూలల నుండే కాక పొరుగు రాష్ట్రాల నుండి పరిశోధకులను ఆకర్షిస్తున్నది.

వేటపాలెం సారస్వత నికేతనం పేరు తలవగానే మనకు కనిపించే మరో మహామనీషి ఆదుసుమిల్లి శ్రీనివాస రావు గారు. వారి జీవిత కృషి, ఆవేదన, జిజ్ఞాస, ఈ సంస్థలో సదా కనిపిస్తూ వుంటుంది.

శ్రీ సుబ్బరాయశ్రేష్ఠి గారు గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘం అధ్యక్షులు గాను, ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగాను, పలు గ్రంథాలయ సభలు నిర్వహించి గ్రంథాలయ ఉద్యమానికి ఎనలేని కృషిచేశారు. జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొని 1920 నుండి ఖద్దరు వస్త్రధారణకు ప్రతిన బూనారు. చాలాకాలం 'ఆనందభారతీ తీర్థ' అను సంస్థకు కార్యదర్శిగా ఉండి భాషా సేవకు, విద్యా వ్యాప్తికి కృషి చేశారు. 'ధన్వంతరీ వైద్యలహరి' ఇత్యాదికృతులను అంకితం పొందారు. పేద విద్యార్థులకు సహాయ సహకారములను అందించారు. వీరు భాషాపోషకులే గాక సంఘ సంస్కరణాభిలాషులు. వితంతు వివాహములను ప్రోత్సహించి జరిపించారు. 1928లో వేటపాలెం పంచాయతీ అధ్యక్షునిగా 3 సంవత్సరములు కడు సమర్థతతో పదవీ బాధ్యతలు నిర్వహించారు. వేటపాలెం వైశ్య సంఘానికి అధ్యక్షులుగా ఉండి కన్యకాపరమేశ్వరీ ఆలయ నిర్మాణాన్ని పూర్తి చేయించి సంఘ అభ్యున్నతికి పాటుపడినారు.

జీవితమంతా భాషా సేవకు, విజ్ఞాన వ్యాప్తికి ధారపోసి 1935 మే 6న పిన్న వయస్సులోనే స్వర్గస్థులైన శ్రేష్ఠి గారు ధన్య జీవులు.

- శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

జై శ్రీమన్నారాయణ ఓం నమో వెంకటేశాయ జై శ్రీమన్నారాయణ

విశ్వశాంతికై

# శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి దేవస్థానము

## పేరు సోముల గ్రామము వారి

అఖండ శ్రీ లక్ష్మీ అష్టోత్తర సహిత శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రపారాయణ

మండల దినపర్యంత (41 రోజులు) మహోత్సవములు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జీయరు స్వామి వారి మంగళా శాసనములతో

## ఆహ్వానము

**భగవత్ బంధువులారా!**

విశ్వశాంతికై పేరుసోముల గ్రామములో (కర్నూలు జిల్లా) వెలసిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి సన్నిధానములో భగవత్ ప్రేరణచే **12-11-96** నుండి **22-12-96** వరకు అనగా శ్రీ దాతృనామ సంవత్సర కార్తీక శుద్ధ పాడ్యమీ మంగళవారము నుండి మార్గశిర శుద్ధత్రయోదశీ ఆదివారము వరకు అఖండ శ్రీలక్ష్మీ అష్టోత్తర సహిత శ్రీవిష్ణు సహస్రనామస్తోత్ర పారాయణము అన్ని ప్రాంతాల విష్ణు సహస్రనామస్తోత్ర సంఘాల భక్తుల పరస్పర సహకారముచే జరుపబడును.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమును పుస్తకములు చూచి గాని, చూడకుండాగాని పారాయణము చేయగల స్త్రీ, పురుషులందరినీ అపూర్వముగా జరుగనున్న ఈ కార్యక్రమములో పాల్గొనవలసినదిగా ఆహ్వానించుచున్నాము. ఈ అపూర్వమైన అవకాశము మీరందరూ తప్పక వినియోగించుకొని శ్రీ చెన్నకేశవ స్వామి కృపకు పాత్రులగుదురని ఆశిస్తున్నాము.

**గమనిక: 1 ఈ పారాయణ కార్యక్రమములో పాల్గొను వారికి ఉచిత భోజన వసతులు కల్పించబడేనది**

## Correspondence Address

1. **N. Ramanaiah, Sri Chennakesava Medical Agencies,**
   Old Post Office Road, KURNOOL - 518 001. Ph. No.: 21341, Res : 25966.
2. **K. Ramachary, Sri Kota Anjaneya Swamy Temple,**
   H.No. 62/86, KURNOOL - 518 001. Ph. No. : 25117.

ఇట్లు

తమ ఆగమనాభిలాషులు

**నిచ్చెన మెట్ల రమణయ్య, శ్రీ లక్ష్మీ చెన్నకేశవ దేవస్థానం**

పేరు సోముల, సంజామల మండలము, కర్నూలు జిల్లా.

పేరు సోములకు రావలసిన వారికి :

వయా తాడిపత్రి, కోవెలకుంట్ల, జమ్మలమడుగు నుండి బస్సు సౌకర్యం కలదు.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1996 డిశంబరు 21 నుండీ 1997 జనవరి 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | 22 | 29 | 5 | 12 | 19 |
| సోమవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| మంగళవారము | 24 | 31 | 7 | 14 | |
| బుధవారము | 25 | జనవరి 1 | 8 | 15 | |
| గురువారము | 26 | 2 | 9 | 16 | |
| శుక్రవారము | 27 | 3 | 10 | 17 | |
| శనివారము | 28 | 4 | 11 | 18 | |

డిశంబరు 25 :- క్రీస్తు జన్మ దినం (క్రిస్టమస్ పండుగ) - దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

డిశంబరు 26 :- తుంగభద్ర పుష్కరారంభం - (గురువు మకర రాశి ప్రవేశం) ఈ పుష్కరాలు 6-1-1997 వరకూ (12 రోజులు) జరుగుతాయి.

డిశంబరు 28 :- పుర్వాషాఢ కార్తె

డిశంబరు 31 :- పేదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 నవంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్ మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ డిసెంబరు నెల 31వ తేదీ లోగా చేర్చాలి.

డిశంబరు 31 :- 1996 నవంబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలకు తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

జనవరి 1 :- ఆంగ్ల సంవత్సరాది.

జనవరి 5 :- గుర్మౌఢ్య అరంభము.

జనవరి 10 :- ఉత్తరాషాఢ కార్తె రాక రాత్రి 2-23.

జనవరి 11 :- రంజాన్‌నెల ప్రారంభం.

జనవరి 13 :- భోగి

జనవరి 14 :- మకర సంక్రాంతి పండుగ - ఉత్తరాయణ పుణ్యకాలం.

జనవరి 15 :- కనుమ.

జనవరి 15 :- చెక్కుద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

జనవరి 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**22, 29, 5, 12, 19 ఆదివారాలు**

---

*నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్ల "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. : మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682 .

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించ బడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

   30×10 రూము రూ.30,000/-, 15×9 రూముకు రూ.25,000/- అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,00,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించ బడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును.

3. వాసవీ భవన్, తిరుమల : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు). సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు యివ్వబడును 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారికి వంశపారపర్యంతం సభ్యత్వం ఉండును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన పర్వ దినం రోజునను, రు.6116-00 సమర్పించిన పర్వ దినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులుచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులుచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణమునకు 4.10.95 ఉదయం గం॥ల 9-21 ని॥లకు శంఖుస్థాపన, అదే రోజు ఉదయం గం॥ల 9-47 ని॥లకు నిత్యాన్న సత్రంనకు అగ్నిప్రతిష్ఠాపన జరిగినది. భోజనహాలు నిర్మాణం చేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రూ.60000/-లు రూముకు సమర్పించిన వారలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల వంశపారం పర్యంతం సభ్యత్వము, పర్వదినం రోజున అన్న సంతర్పణ ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుప బడును. పై యిద్దరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. రు. 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల

నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCET లో పాసై ఇంజనీరింగ్, మేడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ క్రతువు 16.11.95 నుండి 24.11.95 వరకు పుట్టపర్తిలో జరిపించినాము. 1996వ సంవత్సరములో క్రతువు ఎక్కడ జరుపునదీ జరుగబోవు కార్యవర్గ సమావేశములో నిర్ణయిస్తాము.

-: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-


**మూర్తి వెంకటేశ్వర్లు,**

వాసవీ సత్ర సముదాయం, కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.


**N.B :-** పై సత్రముల పేరుతో - DD లు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.

ఫోన్ : 4942074, 4941973



## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను: అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

**ఆర్.ఆర్.నాధం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా
పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# సోమయాజుల వారి ఉపన్యాసాలు - 1

'స్వర్గీయ ఆత్మూరి లక్ష్మీ నరసింహ సోమయాజిగారు మహా పండితులు. సంస్కృత ఆంధ్ర భాషల్లో నిష్ణాతులు. పదునెన్మిది పురాణాలను క్షుణ్ణంగా చదివి అందలి విషయాలను బాగా జీర్ణించుకొన్నవారు. వేదాలనూ, వేదాంగాలైన ఉపనిషదాది గ్రంథాలనూ బాగా పరిశీలించి తన మేదస్సులో దాచుకొన్నవారు. న్యాయశాస్త్ర కోవిదులు. ఆంగ్లమున B.A. B.L., పట్టాలను సంపాదించి, డిస్ట్రిక్టు మున్సబు పదివిని ప్రశంసా పూర్వకంగా నిర్వహించారు. బందరు అనగా నేటి మచిలీ పట్టణములో వేద వృక్షాన్ని ప్రతిష్ఠించి, ఆరాధించారు. మహా ప్రతిభావంతులైన సోమయాజులు గారు ఇప్పటి కృష్ణా జిల్లా నూజివీడు గ్రామములో 25-8-1845న జన్మించారు. స్త్రీ పునర్వివాహ విషయంలో స్వర్గీయ కందుకూరి వీరేశ లింగం గారికి కుడి భుజంగా నిలిచారు. 'లక్ష్మీ నరసింభ సోమయాజి గిరి సహాయం లేకుంటే స్త్రీలకు పునర్వివాహం చేయగలిగి ఉండే వాణ్ణికాను' అని వీరేశలింగం గారు తమ స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నాడు. సోమయాజుల వారు 13-6-1991వ తేదీన స్వర్గస్థులయ్యారు.

సోమయాజులు గారు మహా పండితులే కాదు. గొప్ప ఉపన్యాకులు. వారు చేసిన ఉపన్యాసాలను ఈ సంచిక నుండి ప్రచురించుటను ప్రారంభిస్తున్నాము. ఇప్పుడు మీరు చదువనున్నది సోమయాజుల వారు 1897 జనవరి 28వతేదీన అనంతపురం జిల్లా గుత్తిలో ఇచ్చిన ఉపన్యాసము. గుత్తిలో ఆనాటి విక్టోరియా జూబిలీ సంస్కృత పారశాలలో ఇచ్చిన ఈ ఉపన్యాస సభకు అప్పటి కలెక్టరు ఆంగ్లదొర నికాల్సన్ గారు అధ్యక్షత వహించారు. ఆంగ్ల యువతీ యువకులు పెద్ద సంఖ్యల్లో ఈ సభలో శ్రోతలుగా పాల్గొన్నారు. ఈ ఉపన్యాసాన్ని విని ఆనందించిన సభాధ్యక్షులు నికాల్సన్ దొరగారు, సభలోనే సోమయాజి గారిని ఎంతగానో ప్రశంసించారు. ఇప్పటి గుత్తి పట్టణాన్ని అప్పుడు గౌతమాశ్రమమని పిలిచేవారు. ఇక చదవండి.

సభాధ్యక్షా! సోదరసోదరీమణులారా!

ఉపన్యాపమిచ్చుటకు ముందు ప్రారంభమున క్షమాపణలతో కాలమును వృధాపరచను. నే నుడువబోవు విషయములను మీ రుదారభావముతో గై కొందురనియు, తప్పులను క్షమింతురనియు నే నమ్ముచున్నాను. వాగ్ధోరణితో గాని పదగుంభనలతోగాని నేను మిమ్ముల సంతోషపరుపజాలను. కొన్ని స్థితిగతులను సారాంశములను మీయోజనకై నే నుడివెదను. వేయేల మీ కాశాభంగము కలిగించిన వాడనని జెప్పుచున్నాను. ఎటులైన విద్వాంసుడును, శ్లాఘనీయుడును అయిన కలెక్టరు దొరవా (మండలకరగ్రాహి) రధ్యక్షత వహించుటకై ఆమోదించుటచే ఉపన్యాసమునకు ధైర్యముతో పూనుకొనుచున్నాను. ప్రాగ్విషయములను వారు శ్రద్ధతో గమనించువారును, ఉదార స్వభావులును

అయియున్నారు వేదములను ఇతర సంస్కృత గ్రంధములను బాషాంతరీకరించి ఆర్యులకెల్ల శ్లాఘాపాత్రులైనటువంటి మాక్సుముల్లరు దొరవారి సహపాఠియై నందు వారట్టివారని మనము తప్పక నమ్మవలసి యున్నది. మీరు వేదము యొక్క నామము పెక్కుపర్యాయములు వినియున్నారు. మీలో కొందరవ్వాని భాగములను చదివియున్నారు. వేదమనునది (విద్ - తెలిసికొనుట) అను ధాతువు నుండి బుట్టినది. వేదమనగా జ్ఞానము. హిందూదేశమున దీనిని విదమనియు, వేదమనియు ఉపయోగింతురు. ఇంగ్లండు దేశములో విజ్డమ్ అనియెదరు. ఈ రెండు పదములును ఒక ధాతువునుండియే యుత్పత్తి అయినవి. కనుక నీపదము మనపూర్వులైన పూర్వ పశ్చిమార్యులకు వారు విడిపోకమున్నె తెలిసియున్నదని గ్రహింప వలసియున్నది. విజ్డమ్ అనినను వేదమనినను జ్ఞానమనియే అర్థము. కనుక మన వేదములను వేదము అని పిలుచుట సార్ధకమైనది.

2. వేదమునకు రెండర్థములు. సామాన్యార్థములో మానవునియొక్క జీవయాత్ర విషయమై తెలుపు యే గ్రంధమైనను వేదమని బిలువవచ్చును. సాధారణముగా ఆర్యఋషి వర్యులచే పరంపరాగతముగా నుపదేశింప బడిన మంత్రమునే మనము వేదమని బిలుచుచున్నాము.

3. సర్వమత సమత్వభావము గలవాడను, మీలో ననేకుల ఆదర్శములు కూడా అట్టివేయని నేను నమ్ముచున్నాను. ప్రపంచమందెల్లడలను జ్ఞానము జ్ఞానమె? ఏగ్రంధమునైనను యే తెగనైనను మనము తప్పనియనజాలము. మనమెల్లరము సోదరులమనియు, దేవుడు మనకెల్లరకు తండ్రియనియు నిర్ధారణ చేయుటకై మనము పోరాడుచున్నాము. సత్యము జ్ఞానము ప్రపంచమందేభాగమున నున్నను మన మొప్పు కొనుచున్నాము. హిందూ వేదము, జొరస్ట్రియావేదము, క్రైస్తవ వేదము, మహమ్మదీయవేదము మొదలైన వన్నియు వేదమే?

4. ఈశ్వరుడు ఋషుల రూపమునగాని, మహాత్ముల రూపమున గాని, సత్పురుషుల రూపములవల్లగాని జ్ఞానమును మనకు బోధపర్చిన పైవిధములను ఉత్పత్తి వరుసయు జెప్పియున్నాను. ఖురాను, బైబిలు తరువాతను వ్రాయబడినదని ఎల్లరకు తెలిసిన విషయమే? క్రైస్తవవేదము, హిందూవేదము తరువాత వ్రాయబడినదని ఒప్పుకొనక పోవచ్చును. ఇతర ప్రమాణముల విడచివేసినను ఆ వేదముల కియ్యబడిన నామములే హైందవవేదము పురాతనమైనదని చెప్పుచున్నవి. హిందూ వేదమునకు "శ్రుతి" అను పేరివ్వబడినది. క్రైస్తవ వేదమునకు "స్క్రిప్చర్" అను పేరివ్వబడినది. వ్రాతపద్ధతి మానవుడు సృజింపబడిన కొన్ని వేలవత్సరములకు గానీ అనుసరింపబడలేదని అందరొప్పుకొను విషయమేయని నానమ్మకము. మీరంద రేకీభవించెదరని తలంచెదను. అనేక శతాబ్దముల వరకు ప్రపంచమున వ్రాత యననేమో తెలియదు. వ్రాత యే సంవత్సరములో ప్రారంభింపబడినదో మనమెల్లర మేకీభవింపక పోవచ్చును. కాని ఒకానొకప్పుడది ప్రారంభింపబడినది.

అది మానవునితో సమకాలికమైనది కాదు. "స్క్రిప్చర్" అనగా వ్రాతయనిగాని, వ్రాయబడినదనిగాని అర్థము. కాన బైబిలు వ్రాతమొదలిడిన తదుపరి వెలువరింప బడినదని తెలియుచున్నది. దీనికి బైబిలే సాక్ష్యమిచ్చుచున్నది. నిర్గమకాండలో 32 అధ్యాయములో 15-16 వచనములను చదువుము.

5. మోషే శాసనములుగల రెండు పలకలను చేత పట్టుకొని కొండదిగివచ్చెను. ఆ పలకలు ఇరుప్రక్కలను వ్రాయబడినవి. అవి యీప్రక్కను అప్రక్కను వ్రాయబడి యుండెను.

6. ఆ పలకలు దేవుడు చేసినవి. ఆపలకలమీద చెక్కబడిన వ్రాత దేవుని చేవ్రాత

7. "శ్రుతి" అనగా వినబడినదని యర్థము హిందూవేదము ప్రపంచమునకు వ్రాత తెలియక పూర్వమే వెలువడినట్లు తెలియుచున్నది. ప్రాగ్దేశమందలి పండితులెల్లరు వేదములలో నే భాగమైన వ్రాయబడినట్లు కనబడదని యొప్పుకొనెదరు. వేదము వినబడినదే? విపులభావమునందు వేదమనగా "శ్రుతి".

8. ఋగ్యజుసామాథర్వణములేగాక యింకను కొంతగలదు. హిందూసోదరు లిందు కొప్పుకొనక పోవచ్చును. కాని మన పరాయతము (బ్రాహ్మణము) నుండి కొన్ని యాధారములను జూపగలను. మూడవ ఖండమున (10-11-3) చూడుము ఇంద్రునకును భరద్వాజునకు జరిగిన సంభాషణయందు యింద్రుడు, "అనంతావైవేదాః" వేదములకంతులేదు అని చెప్పియున్నాడు. ఇంతకంటె ప్రబలమైనయాధార మేమికావలయును. "త్రయీవేదాః" అను పదమును మీరెల్లరు వినియున్నారు. అందువలన ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అని మీరు గ్రహించెదరు. అటులైనచో అథర్వణ మే మైనది. కొందరు పండితులు అథర్వణవేదము ఋగ్వేదమునుండి తీయబడుటచే ప్రత్యేకనామ మీయలేదని చెప్పుచున్నారు. అథర్వణ వేదములో కొన్ని భాగములు మాత్రమే ఋగ్వేదము నుండి గైకొనబడినవి. సామవేదములో 73 మంత్రములు తప్ప మిగిలినదంతయు ఋగ్వేదములోనిదేయని నిరూపింప బడినది. కాని సామవేదమునకు ప్రత్యేకనామ మొసగబడినది. అందువలన పండితులు జెప్పునది సత్యముకానేరదు.

(ఇంకావుంది)

## అవోపా, కడప.

పై సంస్థ ప్రతి ఏటా ఇచ్చు స్కాలర్ షిప్పులను పొందుటకు ఆర్థికముగా వెనుక బడిన ఆర్యవైశ్య విద్యార్థినీ, విద్యార్థుల నుండీ దరఖాస్తులు కోరుచున్నది. కె. రామసుబ్బయ్య, అధ్యక్షులు, అవోపా విద్యానిధి, 7/29, జయనగర్ కాలనీ, కడప - 516002. కు రూ. 10/-లు యం.ఓ. ద్వారాన్నూ, అడ్రసు గల కవరును పంపి దరఖాస్తును పొందవలెను. పూర్తిచేసిన దరఖాస్తుపై 31-12-1996 లోగా పై అడ్రసుకు పంపాలి.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

**రిజిష్టర్డు నెం. 328/94**

**బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.**

భారతదేశము లోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండి భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,116/-లు ఇచ్చిన వారు స్థల దాతలుగా ఉంటారు.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కు కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ పై అడ్రసుకు పంపి, రసీదు పొందకోరుచున్నాము.

5 వేల రూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనమునందు ఉంచుతారు.

ఈ పవిత్ర కార్యక్రమానికి ఉదార హృదయముతో సహకరించవలసిందిగా ఉదార హృదయులైన వైశ్య మహనీయులను కోరుచున్నాము.

"ప్రజాబంధు" "దానశీల"

జూటూరు శరభయ్య
కార్యదర్శి

కామిశెట్టి సుబ్బరావు
అధ్యక్షులు

# త్రిగుణములు

శ్రీ చుండూరు శ్రీహరిరావు, గుంటూరు.

త్రిగుణములనగా సత్వగుణము రజోగుణము తమోగుణములు. గుణము అనగా త్రాడు, బంధము అని అర్థములు. ఇవి జీవులను శరీర బంధనములో పడవేస్తాయి. కనుక వీనిని గుణములని యందురు. వీని ప్రభావముచే ప్రాణులు పుణ్యపాప కర్మల నొనర్తురు. ఫలితముగా జన్మల పరంపరలో బడుదురు. దేహములందు బంధింపబడి సుఖదుఃఖముల ననుభవింతురు. మానవులు తమ జీవితములను దుఃఖ రహితములుగా చేసుకోవాలన్నా, సుఖ పూరితములుగా మలుచు కోవాలన్నా యీ త్రిగుణములను గుఱించి తెలుసు కోవాలి. మానవ జన్మను కోరువారు, యోగులు, పరమాత్ముని మహిమను గుర్తించి మోక్షమును కాంక్షించువారు త్రిగుణములను గుఱించి ఆవశ్యం తెలుసుకోవాలి.

సత్వరజః తమసాం సామ్యావస్థా ప్రకృతిః............సాంఖ్యదర్శనం 161

సత్వము రజస్సు తమస్సు అను మూడింటి యొక్క సామ్యావస్థయే ప్రకృతి. కావున యీ మూడునూ ప్రకృతి యొక్క గుణములు. ప్రకృతి క్రమముగా స్థూలమగుచూ జగత్తుగా మహత్తత్వాది కార్యములుగా వికారములను పొందుచూ పంచభూతములుత్పన్నమగును. సూర్య చంద్ర, నక్షత్రములు, నదులు, పర్వతములు, హరితవృక్షాదులు, సకల జగత్తు పంచ భూతాత్మకములు. జీవుల అసంఖ్యాక భిన్న శరీరములు పంచ భూతాత్మకములు. కనుక సర్వ సృష్టి, సకల పదార్థములు త్రిగుణముల ప్రభావమునకు లోబడి చలిస్తాయి. సర్వ ప్రాణులు త్రిగుణములకు అధీనములై ప్రవర్తిల్లును.

మానవులెల్లరు త్రిగుణములకు అధీనులే. ప్రతి మానవుని యందు త్రిగుణములు న్యూనాధికముగా మిళితమై ఉంటాయి. సత్వగుణము అధికముగా గలవానిని సాత్వికుడని, రజోగుణము ఎక్కువగా నున్నవానిని రాజసికుడని, తమోగుణము మిక్కుటముగా గలవానిని తామసికుడని గ్రహించాలి. స్త్రీ లేక పురుషుని చిత్తమునందు జ్ఞాన కాంక్షయున్న వాడు సత్వగుణము, రాగద్వేషము లున్న వాడు రజోగుణము, అజ్ఞానమున్నవాడు తమోగుణము అధికముగా నున్నట్లెఱుగ వలెను.

మానవులపై త్రిగుణముల ప్రభావము

సత్వగుణము :- దీని లక్షణము ప్రకాశము, కాంతి, జ్ఞానము. సత్వగుణము అధికముగా గల వారిలో చిత్తమునందు

ప్రకాశ స్వభావముండును. జ్ఞానము మిక్కిలిగా నుండును. జ్ఞానోపార్జనకై కాంక్ష కలిగి కృషి చేయుదురు. సత్వ గుణులు ప్రీతి శ్రద్ధ ఆర్జనము (Stright forwardness) సరళత ప్రసన్నత లఘుత్వము ప్రశాంత మనస్సు, సంతోషము కరుణ ప్రాణుల యెడ దయ ప్రేమ స్వభావులుగా నుందురు. తేజస్సు నిర్మలత్వము మృదు మిత భాషణ, సత్ ప్రవర్తన, సుఖమయము రోగ రహితులుగా నుందురు. సత్ గ్రంధ పఠనము, విద్యార్జన విద్వాంసుల యెడ గౌరవము, వేదాభ్యాసము, ధర్మాచరణము, సత్యము, త్యాగము, అహింసాది సత్కర్మాచరణము, యజ్ఞయాగాది పవిత్ర కార్యములు చేయుదురు. మానావ, మానములు లాభనష్టములు సుఖ దుఃఖములు శీతోష్ణములు మున్నగు ద్వంద్వము లందు నిర్వికారులుగా స్థిత ప్రజ్ఞలుగా జితేంద్రియలుగా నుందురు. ఆస్తికులు విద్వాంసులు యోగులు నగుదురు. జీవాత్మ పరమాత్మల చింతన చేయుదురు

రజోగుణము - దీని లక్షణము క్రియాశీలత, రాగాత్మకము. రజోగుణుల చిత్తము నందు ప్రవృత్తి స్వభావముండును. నిరంతరము కర్మరులుగా నుందురు. చిత్త చాంచల్యము రాగద్వేషములు దుఃఖము కోరికలు మిక్కుటమగుట, పరుషము లాడుట, వాచాలత్వము కలిగియుందురు. ఈర్ష్య, అసూయ, కామక్రోధములు కలిగించును. ఐహిక సుఖములపై ఆశ, అనురాగము, తృష్ణ, అభిమానము, గర్వము కపటము, అసత్కార్యాచరణము కీర్తిలభించు కార్యములు చేయుట, ధన సంపదల సంపాదన, కార్యశీలత కీర్తికాంక్ష, స్తుతికివశులగుట, విషయలోలత అనగా కోరికలను తీర్చుకొనుటయందు నిమగ్నులగుదురు. పురుషులకు స్త్రీలపై, స్త్రీలకు మగవారిపై అభిలాష వక్రదృష్టి కలిగి యుందురు. హీన రాజసికులు అధర్మపరులు అవినీతిపరులునై ద్రోహచింత పరనింద పరాభవము పరద్రవ్యములపై కాంక్ష కలిగి వ్యభిచారులుగా నుందురు

తమోగుణము :- స్థితి శీలము అనగా క్రియా రాహిత్యము, జడత్వము, అజ్ఞానము, మూర్ఖత ధనత అశుచి మున్నగునవి దీని లక్షణములు. తమోగుణులలో సోమరితనము, అతినిద్ర, మరుపు, ప్రమాదము (పొరపాటు) లోభమోహ మద మాత్సర్యములు, మనోభారము, వ్యాకులత లుండును. లజ్జ భయములు కలుగును. స్వార్థపరులు లోభులు మందబుద్ధులు నాస్తికులుగా నుందురు అధిక తమోగుణులు, వ్యసనపరులు మూఢులు, క్రూరులు, ద్రోహులు, క్రూరప్రేలాపనలు చేయువారు అగుదురు. హత్యలు దోపిడీలు మానభంగములు చేయుదురు.

ప్రారబ్ధ కర్మల ననుసరించి అనగా గత జన్మలలో నొనర్చిన పుణ్య పాప కర్మల ఫలముగా ఆయాపాళ్ళలో

హెచ్చుతగ్గులుగా త్రిగుణములు కలిగిన మానవ దేహము జీవులకు పరమాత్మునిచే నొసంగబడును. త్రిగుణములను వృద్ధిక్షయములను చేయు ఆహార విహారములను సేవించి మానవుడు తన దేహము నందలి త్రిగుణములను సంస్కరించు కొనునవకాశము గలదు.

త్రివిధ ఆహారములు :- ఆయువు, బలము, ఆరోగ్యము, సుఖమునిచ్చు ఆహారములు. మధుర పదార్థములు, రసవంతములు, తైలయుక్తములు, ఎక్కువ కాలము చెడకుండ ఉండునవి. పాలు, నేయి, పండ్లు, కూరలు. బలమునిచ్చు శాఖాహారము, పప్పులు. ధాన్యములు. ఇవి సత్వగుణము నిచ్చును కనుక సాత్వికులు కాదలిచిన వారు ఈ సాత్వికాహారములను తీసుకొన వలెను.

రాజసిక ఆహారము :- ఉప్పు, కారము, పులుపు గల పదార్థములు, తీక్షణత, రూక్షత కలిగించునవి, దుఃఖము రోగములను కలిగించునవి, తైలరహితములు, ఎక్కువ వేడిగలవి, కడుపులో మంట కలిగించునవి, మాంసాహారములు మున్నగునవి రజోగుణమును పెంచును.

తామసిక ఆహారము :- బుద్ధి నాశక పదార్థములు, మద్యపానము, గంజాయి మున్నగు మత్తుపాదర్థముల సేవనము, పొగత్రాగుట, ఎప్పుడో వండినవి, నిల్వ యుంచినవి, పాచిపోయినవి, కుళ్ళినవి, దుర్వాసన గలవి, రసము లేనివి, ఎంగిలి పదార్థములు, మాంసాహారములు మొదలగునవి తమోగుణ కారకములు. (భగవద్గీత సప్తదశాధ్యాయము ప్రమాణము).

మహనీయుల చరిత్రలు, సత్గ్రంధ పఠనము, ప్రక్షిప్తములను వదలి రామాయణ మహాభారతములు, సంగీత భరత నాట్యాది ఉత్తమ కళలు, వేదములు ఆర్ష గ్రంధముల స్వాధ్యాయము సత్వగుణమును పెంపుజేయును. సాత్వికులతో సాన్నిహిత్యము, సత్సంగముల వలన సత్వగుణము వర్ధిల్లును. కామక్రోధాది అరిషడ్వర్గములను వ్యభిచారము మద్యపానాది వ్యసనములను అశ్లీలము హింస నేర ప్రవృత్తులను ప్రకోపింప జేయునట్టిదియగు సాహిత్యము, పత్రికలు, సంగీత నాట్యాదులు సినిమాలు టెలివిజన్‌లు తమో గుణములను అధికముగా చేయును. రాజసికులతో తామసికులతో సహవాసము గూడ రజోతమో గుణములను కలిగించును. రాత్రి జాగరణము, అతినిద్ర తమోగుణమును పెంచును.

ఈ మూడుగుణములలో తమో గుణము కంటె రజోగుణము మంచిది. రజోగుణము కంటె సత్వగుణము ఉత్తమము త్రిగుణముల ప్రభావము చేతను తమగుణకర్మ స్వభావముల ననుసరించియు మానవులు పుణ్యాపాప కర్మలను చేయుచుందురు.

ప్రత్యేక ఫలములుగా మానవులకు లభించు వివిధ జన్మలు.

సత్వగుణులకు లభించు జన్మలు :- యోగాభ్యాసకులు, ధార్మికులు వేదపారకులు, జ్ఞానులు, విద్వాంసులు, వైజ్ఞానికులు, ఐశ్వర్యవంతులుగా జన్మింతురు. ఉత్తమ సాత్వికులు అత్యంత మేధావులు, జీవ ప్రకృతులపై అధిపతులు, ఋత్విక్కులు వేదవేదాంగవిదులు ఋషులు బ్రహ్మజ్ఞానులు జీవన్ముక్తులుగా నగుదురు

రజోగుణులకు లభించు జన్మలు - మందబుద్ధులు బీదవారు శ్రామికులు, శూద్రులు, జూదము మద్యపానము వ్యభిచారాది వ్యసనపరులుగా జన్మింతురు ఉత్తమ రజోగుణులు, ధనవంతులు సుందరులు, కళాకారులు, వైద్యులు న్యాయవాదుల వంటి మేధావులు, నాయకులు సేనాపతులు దేశ పాలుకులుగా నగుదురు

తమోగుణులకు లభించు జన్మలు - జంతు పశుపక్షి జన్మలు, మూర్ఖులు అతిశూద్రులు, నీచవృత్తి కారులు, మాంసభక్షకులు, క్రూరమానవజన్మలు పొందుదురు. అధిక తమోగుణులు క్రిమికీటకాదులు సింహవ్యాఘ్రాది క్రూరమృగములు, సర్పవరాహాది నీచ జన్మలు వృక్షలతాది జన్మలు పొందుదురు

అరిషట్ వర్గములచే మలిన మనస్కులు పొందు జన్మలు -

తీవ్రకాముకులు పిచ్చుక జన్మను, క్రోధపూరితులు తోడేలు జన్మను, లోభులు గ్రద్ధ జన్మను, తీవ్ర మోహవశులు గుడ్లగూబ జన్మను, మదము అహంకార పూరితులు డేగ జన్మను, మాత్సర్యముచే హానికారులు శునక జన్మను పొంది కామక్రోధాదుల ననుభవించి ఆ దుర్గణములనుండి విడివడుదురు.

కృతఘ్నుడు విశ్వాసము నెఱుగుటకై శునకముగాను, నీచనికృష్ట కృత్యముల నొనర్చినవాడు మలాదులను భక్షించే వరాహముగాను జన్మించును నేత్రశ్రోతములతో దుష్కర్మలు చేసిన అంధుడు బధిరుడుగా జన్మించును పాణి పాదములతో నిష్కారణముగా కొట్టుట, తన్నుట వంటి దుష్కర్మలు చేసిన కుంటి అవిటివారుగా జన్మింతురు శరీరముతో హింస చౌర్యము వ్యభిచారాదులు చేసిన మానవేతర జన్మలు పొందుదురు వాక్కుతో అసత్యము కొండెములు పరుషము లాడిన వారికి మూగమానవజన్మ, పశుపక్ష్యాది జన్మలు లభించును. మనస్సుతో పరద్రోహము పరద్రవ్యాకాంక్ష నాస్తికత్వము వంటి దుష్టచింతనలు చేసిన వారు కరినాత్ములు దుష్టరాక్షసులుగా జన్మింతురు సర్వయింద్రియములతో (పంచజ్ఞాన పంచ కర్మేంద్రియములు మనస్సుతో) ఘోరపాపములు చేసిన మనుష్యులు వృక్షాదులుగా జన్మింతురు. అనగా ఏయే ఇంద్రియములతో పాపములను చేసిన ఆయా ఇంద్రియములతో దుఃఖముల ననుభవింప వలసిన జన్మలను

పొందుదురు. (గమనిక - వృక్ష లతాదులుగా జన్మించు ప్రాణులయందు పర్వేంద్రియములు పనిచేయవు. మూర్ఛ గతావస్థలో నుండును. వానికి సుఖ దుఃఖములు కలుగవు. కనుక శాఖా హారము వలన పాపము కలగదు.)

లోకమనగా శరీరము, జన్మయని అర్థములు. నరకలోకము (యమ లోకము) స్వర్గలోకములని ఏమియులేవు. దుఃఖమయ నీచమానవ మానవేతర జన్మలన్నియు ప్రత్యక్షయమలోకములు, నరకజన్మలు. సుఖమయ ఉత్తమ మానవ జన్మలు స్వర్గలోకములు. స్వర్గము స్వర్గాధిపతి ఇంద్రుడు, దేవతలు, రంభ, ఊర్వశి, మేనకాది దేవవేశ్యలు అన్నియు అభూత కల్పనలు. మానవులలో మధుర గాయకులను గంధర్వులని, అత్యంత సుందరీమణులను అప్సరసలని, ఐశ్వర్య వంతులను యక్షులని, విద్వాంసులను దేవతలని, వేదవేదాంగ విదులను ఋషులని, క్రూరులను రాక్షసులని ఎఱుగవలెను...

...........(మనుస్మృతి 12 వ అధ్యాయమునందలి శ్లోకములు ప్రమాణము) .

ఈరీతిన దుష్ట మానవులకు పాపులకు దుఃఖములను నీచజన్మను ఇచ్చి వారిని శిక్షించి రోదింపజేసి సన్మార్గులనుగా తీర్చిదిద్దువాడు కనుకనే భగవంతునకు రుద్రు డనునామము కూడ కలదు. (రోదయతి ఇతిరుద్రః). యజుర్వేదము షోడశాధ్యాయ మగు రుద్రాధ్యాయములో పరమాత్ముడు దుష్టులను పాపులను శిక్షించు విధానమున్నది.

కనుక సకల మానవులు త్రిగుణముల ప్రభావములను తెలిసి కొనవలెను. రాజసిక తామసిక ఆహారాదులను క్రమపద్ధతిలో త్యజించి సాత్వికాహారమును సాత్విక కళల ఉపాసన, సాహిత్యాదులను సేవించవలెను. సత్వగుణులతో మైత్రి చేయవలెను. ఇట్లు తమ జీవన విధానములను సంస్కరించుకొని మరల ఉత్తమ మానవ జన్మను పొందుదురు గాక! వేద వేదాంగముల అర్థ సహిత పఠనము, వేదోక్త ధర్మాచరణము, నిరాకార ఈశ్వరుని స్తుతి ప్రార్థన ఉపాసనలను ఆచరించి త్రిగుణాతీతులయి, పతంజలి మహర్షి విరచిత అష్టాంగ యోగమార్గావలంబులయి మోక్షమును పొందుదురు గాక.

*(మద్గురు వరేణ్యులు కళాప్రపూర్ణ దర్శనాచార్యులు శ్రీ గోపదేవ్ శాస్త్రి గారి రచనల సహకారము, వారు ప్రసాదించిన జ్ఞానభిక్ష యీ రచనకు ఆధారము.)*

## కల్యాణదుర్గములో కళ్యాణ మంటప శంఖుస్థాపన

అనంతపురం జిల్లాకు చెందిన పై పట్టణములో స్థానిక ఆర్యవైశ్య సంఘమువారు నిర్మించ తలపెట్టిన శ్రీ వాసవీ కళ్యాణ మంటప నిర్మాణానికి ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులు శ్రీ కాసం శెట్టి రాధాకృష్ణయ్య గారు 23-11-1996వ తేదీన శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ చిందనూరు కిరీటప్ప వీరి ధర్మపత్ని శ్రీమతి సుబ్బరత్నమ్మగారలు భూమి పూజ చేశారు.

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.12.1996 నుండి 20.1.1997 వరకు)

దుకాణాలు - సంస్థల చట్టము క్రింద రిజిష్టరు కాబడిన తమ వ్యాపార సంస్థ యొక్క రిజిస్ట్రేషను పునరుద్ధరణ చేసికొనుటకుగాను తమ దరఖాస్తును A-A ఫారములో పంపనివారు సదరు A-A ఫారాన్ని ఈ (డిసెంబరు) నెల 30వ తారీఖులోగా "ఫైను"తో పంపాలి

చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకం పన్ను మొత్తానికి చెక్కును వ్రాసి వచ్చే (జనవరి) నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి చెక్కు ద్వారా కాకుండా చలానా ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును జనవరి నెల 20వ తేదీన గానీ, అంతకు ముందుగా గానీ చేరునట్లుగా పంపాలి

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 నవంబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్ మెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ డిసెంబరు నెల 31వ తేదీ లోగా చేర్చాలి

---

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s Vasavee Printers. CUDDAPAH - 516 002. ☎ : 25025.